# సత్రప్రభూపద్యమాల.

ఇది

శ్రీరాజా గోడె నారాయణగజపతి

రాయనింగారు

C. I. E. వారి

సెలవుప్రకారము

విశాఖపట్టణంబున

ఆర్షముద్రాశాలలో

రెండవపర్యాయము ముద్రింపబడి

ప్రచురింపంబడియె






1894.

Publisher Sri Rajah G. N. Gajapati Row C. I. E

Printer D. Guranna.

# సత్రప్రభూపద్యమాల.

ఇది

శ్రీరాజా గో॥ వెం॥ నారాయణగజపతి

రాయనింగారు

C. I. E. వారి

సెలవుప్రకారము

విశాఖపట్టణంబున

ఆర్షముద్రాశాలలో

మూడవపర్యాయము ముద్రింపబడి

ప్రచురింపంబడియె



1894.

Publisher Sri Rajah G. N. Gajapati Row C. I. E

Printer D. Guranna.

# అవతారిక

విరోధిసంవత్సరమందు మొదటిభాగములో నాకు వాల్తేరులో ప్రబలమైన కాయిలా చేసి దైవానుగ్రహమువల్లనివర్తించినది- అట్టిదశలో నుండుదగిన యాతురతతో భగవంతునియొక్క అపారకారుణ్యమును ఆయన మహిమను నేను చింతింపుచుండగా ఇంకను నాకుబలము రాకమునుపే ప్రార్థనాపూర్వకమయిన కొన్ని పద్యములు చేయించవలెనని బుద్ధిపుట్టి సంస్కృత దేశ్యాంగ్లేయ గ్రంథములఆకలింపునుబట్టియును నాయనుభవమునుబట్టియును కల్పనలనిచ్చి పద్యములు చేయవలయునని నా సుహృదులును కవిశిరోమణియును శ్రీవత్సగోత్రోద్భవుండును రామస్వామిభూసురతనూజుండును అనుగొండ వెంకటశాస్త్రిగారిని ప్రార్థింపగా ఆయన లక్షణసంయుక్తమైన ఛందస్సుతో సత్ప్రభూ అనేసత్ (ఉన్నాడు) అనే మహావాక్య నామాంకితముగా 30 పద్యములు నా తాత్పర్య ప్ర

కారము రచించెను- అవి మొదటిమారు ఆసంవత్స
రమున నేఅచ్చువేయించబడెను- తిరిగియుమతి ౩౦
పద్యములు అటువంటి కల్పనలనిచ్చి ఆయనచేత నేఖ
రసం॥రములో చేయించి అప్పుడు అచ్చువేయింపబ
టమైనది- ఇప్పుడు తిరిగియుమతికొన్నిసవరణలుఇ
చ్చి ఆయనచేతనే కొన్నిపద్యములను తిరుగమార్పు
చేయించి ఈజయసంవత్సరములో మూడవపర్యా
యము సత్ప్రభూపద్యమాల అచ్చువేయించడమ
యినది- ఈసత్ప్రభూ పద్యమాల భగవంతుడు
సృష్టికర్తయనియును అధిపతియనియును శాసన
కర్తయనియును సమస్త మంగళప్రదుడనియును
నాశరహితుడనియును మనుష్యుడొకనికొకడు స
హజన్ములనియును పరస్పరసహాయుడు అగుట
యెకాకుండ ఆత్మవత్సర్వభూతాని అనునట్లు తనవ
లె మిగిలిన అన్నిభూతములను చూచుకొనవలెనని
యును ఆయనయొక్క స్మృతికలుగజేసికొనవలె
ననియును చెప్పుచున్నది- కాగా ఈసత్ప్రభూప
ద్యమాల అన్నిమతములవారికిని ఉపయోగించున
నితలంచుచున్నాను- ఇదిఓంతత్ సత్ ప్రభువునకు
అమితానూస్పదుడనయినట్టియు కిల్బిషచిత్తుడనయి

నట్టియు నేను నామనస్సంతాపముతీరుటకు సమ
ర్పించుచున్నాడను.

జయసం॥ర శ్రావణశు ౧
గురువారము
1894 సం॥ ఆగష్టు నె ౨ ది.

గోడేనారాయణ
గజపతిరాయుడు.

ఓంతత్ సత్.

# సత్ప్రభూపద్యమాల.

ఉ॥ ఆదినొకండవై వె కల వన్యమొకించుకయై
న లేమునీ। వాదట సర్వసృష్టినిచయం బొనరించి
న మేటివంచు ని। న్వేదశిఖల్ నుతించుఁగద నిత్య
ము జ్ఞాన మనంతముఁ శివం। బాదిమబ్రహ్మమై
న నిను ప్రాంజలిజేసి నుతింతు సత్ప్రభూ॥౧॥

శా॥ సర్వాభిజ్ఞుని సర్వశక్తియుతునిఁ స
ర్వాశ్రయున్ సర్వగుఁ। సర్వాదేశవు నద్వితీ
యునొకనిఁ స్వచ్ఛందునిఁ బూర్ణునిఁ। సర్వ
స్థావరజంగమాత్మక జగత్సంధాయకున్నిష్కలుఁ।
నిర్వేల ప్రవిభాసి దివ్యమహిమున్ నిన్గొల్చెదఁ
సత్ప్రభూ॥౨॥

చ॥ నిరవధికంబు నిస్తులము నీలమమూతఁ
మ నేకగోళసం। భరితము వాయుపూర్ణము నభం
బది దానుదయింప హేతువై। బరసుననంతు ని

షట్కలు ప్రభామయు సర్వవిభుఁ మహాత్ము నె న్నె
రుగఁగఁ జేయు చున్నదిగదే జగదేక శరణ్య సత్ప్ర
భూ॥3॥

మ॥ ఘనమైవతీరలు నీని దేశమున నేకస్థా
యినై చుట్టునుం జనుగోళంబుల కాత్మ చండతర
తేజంబుం బ్రసాదించి చె ల్వొనరం జేసిన యం
శుమాలి తెలుపుఁ జ్యోతిర్మయుఁ శాశ్వతుం
దనకున్ సంభవ హేతువా మ్యనిని నున్ తథ్యంబు
గా సత్ప్రభూ॥౪॥

చ॥ బరువడి మొగ్గవేయఁగతి పరిభ్రమణముం
జనుభౌమగోళము రవిరుచులఁగప్ప జీకటులు గ్ర
మ్ము నిశిన్ని జదీప్తి మింటియఁ బరమున తారలాప్వ
ను భవతర్షణామృత బిందుజాలము ట్లరయఁగ
నింతకుఁ బ్రభుడ వాద్యుడవాఢ్యుడవీవె సత్ప్ర
భూ॥౫॥

ఉ॥ చల్లని కాంతి చేత సుధజల్లుభగోళవిభుం
డురాత్రులం దెల్ల వెలుంగుచుండు రజనీశుడు దా
నుదయింప హేతువై సల్లలితప్రసన్నతయు సం
తత సాంద్రకృపారసంబు రం జిల్లఁగఁ జేయు ని
న్నెరుఁగఁజేయుఁగదే జగదేకసత్ప్రభూ॥౬॥

చ॥ అరయఁగ గోళజాలమున నల్పము శైలనదీ
మహీజసం। భరితము నేక నక్రఫణి మత్స్యపరీత మ
హార్ణవాఢ్యమై। నరమృగపక్షికోటుల దనర్చుమ
హీమయ గోళమెల్ల బె। ల్లరుదగుచున్న నీకలిమి
యందు లవంబన నొప్పు సత్ప్రభూ॥౬॥

మ॥ వరహీరంబులు కెంపులింద్రమణులున్
వైడూర్యగోమేధికో। త్కరమున్ బ[illegible]పుష్య
రాగములనంతంబుల్ నిధానంబులై। [illegible]యన్
కాంచన తారకామ్రములసంఖ్యంబుల్ మహా
బ్ధిన్ మనో। హరముల్ మౌక్తికవిద్రుమాదులును
వాచాతీతమా విస్తరో। ర్వరసౌభాగ్యము నీదు కల్మి
కి లవప్రాయంబగున్ సత్ప్రభూ॥౭॥

శా॥ వేమారుం జరియింపుచుండు నహహా
విశ్వం భరన్నీగము। గ్రామంబై దగు నాజ్ఞచేతను
వసంత గ్రీష్మవర్షాశర। ద్ధేమంతర్తులు పిమ్మటన్ శి
శిరముల్ హేలాగతిం జూపుచున్। స్వామిన్ సర్వ
శరణ్య నిన్ను మది నే భావించెదన్ సత్ప్రభూ॥౮॥

చ॥ పికములు కూయ భృంగములు పెల్లుగమ్రో
య శుకీకదంబవా। గ్యకసనమే మొడంబొలిచి వే
డ్కలు సేయ సుమావృతంబులై। సకలలతానికా

యములు చంద్రికగాయచిగుళ్లుసత్ఫల। ప్రకరమ
మేయమైతరులబాయకమించు వసంతవేళ తా।
నకమహీతాజ్ఞచేతగద వచ్చుచు నేగుచున్నుండు
సత్ప్రభూ॥౧౦॥

చ॥ కరమలర స్వసంత మతికమ్రన హమ్రము
ఖమ్రసమ్రది। స్ఫురితఫలౌఘతోషిత సుపోషితమ
ర్త్యశకుంతమై మనో। హరసుమసౌరభాసిల సమా
వృతసర్వదిగంత మైభవ। త్వరమనిదేశమూని
గదవచ్చుచు నేగుచునుండు సత్ప్రభూ॥౧౧॥

చ॥ తపనుడు సహ్యవేళ లరుదాచుట కబ్ధిమహీ
గతాంబుశ్రల్। విపులతరోగ్రదీధితుల బీల్చగనప్పు
డు భీష్మమైన గ్రీ। ష్మఋసమయంబె సంగగవిచం
దనశీతలవాతపోతముల్। కృపవెలయింతువీభువ
నతృప్తిఘటింపగాదె సత్ప్రభూ॥౧౨॥

ఉ॥ నల్లని మేఘజాలముదనచిజగత్పరితాపమా
చిరం। జల్లుచుజీవకోటులకు జీవనమై దగునోప
ధీచయం। బెల్లనుపండజీవనము నియ్యగవార్షకవే
ళ జూపునీ। సల్లలితప్రభావమును సన్నుతిసేయుచు
నుందుసత్ప్రభూ॥౧౩॥

ఉ॥ భూసతికిన్ సువర్ణమయభూషలనన్ కల

మంపుసస్యముల్ । భాసురలీలఁ బండి కనుపట్టసుధా
రుచి నిర్మలోదక । శ్రీసముపేతవాహినులు నే
న్నలరన్ శరదాగమస్థితిం । జేసిన నీకృపారసము
చెల్వమదిన్ భజియింతు సత్ప్రభూ ॥౧౪॥

చ॥ అళికులసంకులాబ్జగళ దచ్ఛరజోవిలసత్త
టాకముల్ । వెలయ జగంబుపై మిగుల వెల్గఁగా
భవత్కృపారసం । బొలికెననన్ సుధాకరమ
యూఖములొప్ప శరద్విలాసమున్ । నెలకొనఁజే
యు నీకరుణ నెమ్మదినెన్నెదలంతు ; ప్రభూ ॥౧౫॥

మ॥ అమృతచ్ఛాయ నమేయమై హిమసికా
యంబర్యమ్ముం బ్రోకిస । ర్వమహీంద్రోపగ సస్య
వాసరము లల్పంబై నిశల్ దీర్ఘమై । యమరంజ
ల్లదనంపుకుప్ప బహుధాన్యక్షీరసౌభాగ్యవం । తము
హేమంతముమించు నీదగు కృపాధారం గదా
సత్ప్రభూ ॥౧౬॥

మ॥ విరళంబై ధరణీతలంబున హిమావిర్భా
వగస్పష్టగా । సరియై యూష్మము శీతమున్ దిననిశ
ల్ సంధిల్లగా నిత్యభా । స్వరసౌభాగ్యను భవంబు
నొంది సకలప్రాణుల్ ప్రహర్షింపగా । సిరి
గాంచున్ శిశిరంబు నీదుకృపచే జెన్నొందుచున్

సత్ప్రభూ॥౧౭॥

చ॥ అనలుడు ప్రజ్వరిల్లను శిరాంశుడు వెల్గొ
నరించు వీచున। య్యనిలుడు వృష్టిపైకొలుప్ప న
గ్రభ్రములింద్రియముల్ మనంబువే।డన్ను పనిబూ
ని చేయునిజకార్యము లెవ్వనియాజ్ఞ చేత న।య్యా
నఘునవంతు నాద్యునినియామకు నిన్నుభజింతు
సత్ప్రభూ॥౧౮॥

చ॥ ఒరుల కదృశ్యుడయ్యుగనుచుండు వినం
బడడన్నియున్వినున్। మరియునగోచరుం డఖిల
మానసముల్ దనకెంతయేనిగో। చరములుగాగ
జేసికొను సర్వమెరుంగు నెరుంగరాడు దా।నరు
డుగ నెవ్వడట్టిమహామాత్మ్యుని నిన్నుభజింతుసత్ప్ర
భూ॥౧౯॥

మ॥ అనివార్యాగమజాలమందు భవదీయానం
త కళ్యాణవా।ద్గుణ బృందంబులు బెల్లు చెప్పబ
డెతత్ప్రాణతత్త్వముగ స్థితి। న్గనలేకెందుననుండి
క్రిమ్మరీయె వాక్య శ్రేణి చిత్తంబుతో। ననుచోంత
త్సదటంచు చెప్పబడియెన్ వ్యక్తంబుగా సత్ప్ర
భూ ॥౨౦॥

మ॥ సరపిన్ భూతగణంబు దేవలనన్సం

భూతమాదేని చే। పరివృద్ధింగను దేనియందణగు
నో బ్రహ్మంబ దేయంచు నీ। పరతత్వంబను మాన
వృత్తియు యతోవాయ న్మహో వాక్యమం। బరగం దె
ల్పి వెయ్యి నిన్నుమున్నలో భాషించెదన్ సత్ప్రి
భూ ॥౨౧॥

చ॥ బోధవి పరస్పరం బఖిలభూతములుం గ
రుణారసంబు। నెమ్మదికడు ప్రేమయుం బడసి మె
త్రిని వృద్ధిని జెందుచుండె తత్స్వదములమా గుణ
ద్వయము చారుభవ తత్కృపచేతగాదె పెం। పొ
దవుచునుండె దివ్యమహిమోజ్జ్వల సర్వశరణ్యస
త్ప్రభూ ॥౨౨॥

చ॥ జనకుడవీవు నీవలన సంభవమొందితి మె
ల్ల వారమే। పునదగు మైత్రినొందొరులమున్ సహ
జన్ములయట్ల సంగగా। ననిశము నీదు దివ్యమహి
మానుభవం బొనరించునట్లుగా। ననుకృపసేయవే
యఖిలనాయకసర్వశరణ్య సత్ప్రభూ ॥౨౩॥

ఉ॥ తల్లులు పిల్లలున్ మరియు దంపతులొండొరు
గూడి వేడ్కతో। నుల్లసిలంగ ప్రేమయు శిశూద
యమందె తదీయరక్షకై। తల్లిచనోజ మద్ధములు
దారొసనజేసి జగంబుబ్రోచు నీ। సల్లలితప్రభా

వమును సన్నుతి సేయుచునుండు సత్ప్రభూ ॥౨౪॥
చ॥ దనరు పనుల్ ఘటించుటకు తావక సృ
ష్టపదార్థజాలముం । బెనగొను ప్రేమ చేననుభవిం
చుట కింద్రియవర్గమిచ్చి నెమ్మనమును బుద్ధినిచ్చి
మరి మంచివివేకమొసంగి పీనినే । ల్పనికి స్వతం
త్రితన్వదిలె వైచితివీజనులందె సత్ప్రభూ ॥౨౫॥
మ॥ ఆరయన్ సత్త్వరజస్తమోగుణములత్యా
సక్తి నీ సేవకున్ । గరణీయంబుల కాత్మరక్షణను
గల్గం జేసితొనంతము । ష్కరులై వేరొనరించు వా
రలను చక్కం జేయుచున్ బ్రోచు నీకరుణాసా
రము నెంత చెప్ప నినువేడగన్ గొల్చెదగా సత్ప్ర
భూ ॥౨౬॥

మ॥ స్వమతంబం నివార్యమైతగు మహోవా
క్యంబులంబట్టి ధన్యులు హృద్యంబు పవిత్రభూతమ
ననీనామంబునుం గొందరు మతేజోమయుడం
చుగొందరు దయార్ద్రేయుచుండు గడుం । దమి
చే కొందరనంత దివ్యమహిమాధారుండటంచున్
సముద్యన్ములై కొందరు నిన్నె కాంతురీ ధా
త్రీజనుల్ సోదరుల్ । సమతస్వరలు వీరికెల్లపిత
వెంచ నీన్నవెకా సత్ప్రభూ ॥౨౭॥

ఉ॥ నీవొనరించు గోళముల నేకములంచు ధరా
సులల్పముల్ । ధీపిలసిల్లి భూజనులు తెల్విని నీ
న్గొలువంగ జేసితో । వాపిరి సూర్యలోకముల వా
రికి నెంతటి తెల్వి నిచ్చితో । యాః మహాత్మలెంత
మహిమానుభవం బొనరింతురో కో భూతావళి
కెల్లని న్గొలుచునంతటి భాగ్యమికెద్ది సత్ప్రభూ॥ ౨౮॥

చ॥ కుతుక మెసంగగా పతులకుం బతి పిత్ర
లైనవారికి । శివల దేవతాతతికి జెన్నగు దైవత
మైన నిన్నుమ । ద్గతియనుచుం దలంచినను గల్గ
నె మెట్టి భయంబులైన న । చ్యుతజగదీశ దివ్యమ
హి మోజ్జ్వల సర్వశరణ్య సత్ప్రభూ ॥ ౨౯॥

మ॥ పరమేశుండవశేషలోక సృజనన్ బ్రైకొ
యప్పావనో । పరిలోకంబుల వారి నేయనక స్వాప్న
జ్ఞానులన్ మర్త్యులం । బరిపాలింపుచు బ్రోచు
చుండుదువు సర్వత్రాణ దీక్షాధురం । ధర సర్వే
శ్వరమత్కృతానుగత చేతస్కుండ బాధుండ స ।
తత్కరుణానిత్యము నీపయిం దలపు గల్గంజేయవే స
త్ప్రభూ ॥ ౩౦॥

మఱియు॥ ఉ॥ భాతిగనీవు సృష్టిని ప్రవర్తిల
చుడిన భూరాశిలో । జాతికి నాత్మ జాప్రయు

సర్వప్రాణివీక్ష్య పరస్పరానుకం। పాతిశయాప్తి మాన
వుల కాగుణ మస్సిటగల్గ జేయుటన్। భూతసహా
యులైనరులు బొల్చిరి నీకృపగల్గి సత్ప్రభూ॥౩౧॥

మ॥ అనుకంపాగుణమిచ్చినాడవు మనుష్య
శ్రేణికిన్ సర్వచే। తనరక్షాస్థితికల్గు నీవొసగు
టం దన్యత్ర్యాలనోన్యసం। జనిత స్నేహ సహాయ
తాపనకళా సంపూర్ణులై పాణిర। తుణబుద్ధిం
దనరారుచుండిరిగదా సర్వప్రదా సత్ప్రభూ॥౩౨॥

మ॥ మనుజశ్రేణికి నీవొసంగు ననుకంపన్
చక్రవర్తుల్పరా। తనులుర్విన్ పశుపక్షిముఖ్యము
గు భూతశ్రేణికిం గూమిన్ పెం। పునగట్టించిరివై
ద్యశాలలెలమిన్ పోషించిరింక న్నరుల్। గనయు
న్నారలదీక్షనీమహిమ దెల్పన్శక్యమే సత్ప్రభూ॥౩౩

మ॥ దనరంగొందరు మానవోత్తములు రక్త
క్షాజనప్రీతిగా। ఘనసత్రంబులు నన్నదానములు
భిక్షాదానముల్ చెర్పులే। యనుకంపాగుణకృత్య
ము ల్పలుపుచున్ ద్రాసగ్గుణంబీవొసం। గిన దాగా
దెదరం బెనీదు కరుణన్ గీతింపగా సత్ప్రభూ॥౩౪॥

మ॥ ఆశరూధంబుగ జ్ఞానరూపుడవు నీవంచు
న్మహావాక్యసం। తతి దెల్పున్మరి జ్ఞానముం దెలియ

విద్యాజాలముం గల్గఁజే। సితివా విద్యలునిన్నెఁడుం
గుఱుకుగా జెన్నొందవా నిన్నను। గ్రత జెప్పంజదివిం
ప మనుష్యులకు వేడ్కల్ జూపునీవిచ్చునా। యత
మహా మేల్మియ నీదు సత్కరుణ యెంతైయున్నదో
సత్ప్రభూ॥ ౩౫॥

చ॥ కనదనుకంపనీవొసఁగి గావగ మనుష్యులు
దుష్టులైతమం। బునను రజోగుణంబునను మోహి
తులైయుతరేతరో గ్రహ। నిబడుచుం మరంచు కరు
ణించి క్షమాగుణమిచ్చినాడవం। దునరులొండొ
రుల్గలసి తోడగుచుందురుగాదె సత్ప్రభూ॥ ౩౬॥

చ॥ వితతభయాపదాతుర నిరుపేదను గన్గొని
సత్వరాత్ముడై। ప్రతిఫలవాంఛగోరకయె పైకొని
బోవితదీయ సౌఖ్యసు। స్థికతితృప్తియుఁ బ్రియ
ము జెందునరుండనుకంపచేత గూర్చితివి తదాప్తినీ
కరుణ జెప్పదరంబగునెట్లు సత్ప్రభూ॥ ౩౭॥

చ॥ ఇదియునుగాక లోకమున నెట్టి దయాగు
ణకృత్యముల్నరుల్। వదలకొనపరతృప్తిగని వారికి
సద్గతిగూర్తురంచు త। త్పదముల శాస్త్రముల్
హృదయసాక్షియుదప్పక చెప్పుచుండె దె। ట్పదర
మె. నీవదాన్యతను భద్రగుణాంబునిధాన సత్ప్రి

భూ॥ ౩౮॥

చ॥ ఒనరగ పంచభూతముల నోషధుల న్నలు
గంగ జేసి చే। తనులకు తృప్తి పైకొలిపి దానరో
గుల జేయువాడవీ। వనుపమ సత్కృపానుయుడ
వాదిమమూర్తివి సర్వలోకర। క్షణుడవు సర్వ
కర్తవనిశంబును నిన్ను భజింతు సత్ప్రభూ॥౩౯।

ఉ॥ భూరిశుభాన్వితంబు రసపూరితమై వెల
యంజగంబు నా। నారచనాచమత్కృతి నొనర్చిన
మేటివి నీవె దివ్యవా। గ్ధోరణి మర్త్యసంతతులకుం
గలిగించి భవన్మహత్త్వముం। వారక గన్నుతించు
టకు ప్రాజ్ఞులజేతువు నీవె సత్ప్రభూ॥౪౦॥

చ॥ తనవలె సర్వభూతముల దాగను చుండుట
యన్యుడే గతం। దనయెడనుండగా దలచు దానటు
లన్యులపట్లనుంటయుం। జనహితమీగుణాద్వయము
శాస్త్రములం గనుపట్టె నీవు ని। మ్మనుజులకెల్ల ని
చ్చతి మామకచిత్తము నీగుణాద్వయిన్। బనివడి
యుండునట్లుగ కృపామతి సేయగదయ్య సత్ప్రభూ॥౪౧॥

చ॥ చుబుకగ భావ్యనశ్వపరిహాచనభీతిసణం
ప సూర్యమిం। పలరె నదెద్దియున్న భవదాజ్ఞకు

లోనివి భావిసంగతుల్। వెలయగ నీకధీనమయి
విశ్వవిధానము జెల్లునిట్లు నీ। స్థూలగతిమించు నీశ
రణుజొచ్చుటయేకద సర్వశక్తిపం। కలిత దయా
నిధీ భువనకారణ కారణ దేవసత్ప్రభూ॥౮౨॥

చ॥ ఇనకరరీతిహేతి నెసగించి మహాంబునిధి
వైన నీరవ। ర్యునికలస్త్రసంధ్యరుచియోజక్రమం
బున దూలునాశయున్। గొనకొను ప్రేమయున్
ప్రియము గొల్పువిలాసవతీసుధాతిమో। హానల
నువిభ మైకకళలైపొదవ సత్కళలట్లు క్షీణమా। న
నిశమునిన్భజించునరుహర్షకళల్ ధ్రువమానుస
త్ప్రభూ॥౮౩॥

చ॥ మెరుపువలెందళుకుకనను మించినశించు
జగత్పదార్థముల్। వరసుఖజన్యహర్షమును వా
విరినస్థిరసంప్రకాశమా। నరయుగదుఃఖజాల జని
తార్తియునస్థిరనేత్రధారయా। స్థిరుడవునీవె కా
క కలదేమరియెద్దియునైనసత్ప్రభూ॥౮౪॥

ఉ॥ పొందునె నీగుణానుభవ భూమినివక్క జ
గత్పదార్థకాం। తుందగు లోందుపూరుషుడఖం
డతరానుపమానమానితా। నందముతండులాశ్ర
యమునంగనుగాకలయూతనాకచే। జెందు నెత్ప

ప్తి నెవ్వఁడు నచింత్య గుణాంబు నిధాన సత్ప్రభూ॥ ౪౫॥

ఉ॥ శ్రీకరవస్తుసంభృత మచింత్య రసాభ్యుదయంబు హాస్థలీ। లాకలనాకరోజ్జ్వల విలాసవతీసుత బంధువర్గమై। ప్రాకటరీతిచేత గనుపట్టిన స్వర్గము నీపంచమం। దేకవరోసి నూగులు వసిందను వెల్లనుపుట్టవెట్టని। స్నేకమనస్కులై గొలుతు రెట్టిదొ నీమహిమంబు సత్ప్రభూ॥ ౪౬॥

మ॥ అలఘుజ్ఞానము నీవొసంగమును లయ్యర్థంబు బ్రాపించి నిర్మలులై నీయెడరక్తులై నినుమది స్సంధించి హర్షింతురు। జ్వలరక్తి ప్రదతావకీన సుగుణాస్వాదోదయద్రక్తికే। వలమైమీర ప్రపంచ రక్తి యది యాస్వాద్యంబకో సత్ప్రభూ॥ ౪౭॥

ఉ॥ నిత్యమునిత్యముం గని యనిత్య జగత్తును రోసి నిత్యునిం। బ్రత్యహముం భజించు మునిపంక్తికిసంపదతిస్ఫురన్మనో। వృత్యభిపూర్తిపై గొలుపుదివ్యదయాబ్ధివిసర్వలోకసం। స్తుత్యుఁడవప్రమేయ గుణధుర్యుఁడ పేశిత పేశకోటికిన్। నిత్యము నిట్లు పెంపెసఁగ నిన్గొలుతు న్పరమేశ సత్ప్రభూ

భూ॥౪౮॥

చ॥ వినుతరసాభిరంజితము విశ్రుతరూపవిచి
త్రితవస్తువై దనరు జగంబొనర్చితదవిద్యనిభంజింపక త
ద్విధాయకు న్నను భగవంతుని న్నరముని న్నపరి
పూర్ణరసాశ్రయున్మనుల్। పనివడిగొల్తురట్టిపని
భాగ్యముగాదె దలంప సత్ప్రభూ॥౪౯॥

ఉ॥ మానుగ నీవొసంగిన సమంచిత బుద్ధియు
నింద్రియంబులున్। మానసము న్వివేకము సమాన
రసైకవిభాసురప్రపం। చానుభవార్థమే యను
చు నాత్మదలంపగ* వల్వదింక నీ। ధ్యానమొనర్ప
సాధనముల్తై యపవర్గములుగాదె సత్ప్రభూ॥౫౦॥

ఉ॥ కర్మమొనర్చువారలకు కాయములెన్ని
యునేగునంత తత్। కర్మఫలించి యాత్మలకు గా
ఢపు తెల్వి జనించి దానిచే। నమ్మిలిమీర నీపదము
నందు వసించునటంచు కొందరీ। ధర్మము దెల్పు
చుందురుగదా జగదాదరణీయ సత్ప్రభూ॥౫౧॥

మ॥ క్రమజన్మంబులు మిథ్య యీభవమునం
గాంక్షించనీతిప్రకా। రమున న్వర్తిలి భక్తినిన్గొ
లుచు చోరంజిల్లునది వ్యాపా। గము నాత్మన్గనునంచు
కొందరును పశ్చాత్తాపముం జెందెదెం। దమున

రులౌటంమరు కొందరీశ సకలశ్రేయస్కరా సత్ప్రభూ॥౫౫॥

ఉ॥ ధీనిధులిట్లు మోక్షనియతి న్భహురీతియ టంత్రు తత్పరి। జ్ఞానమొకింతయుం దెలియజాలనె రుంగను నేయనంతక। ధ్యానగుణప్రభావము దయాసముదంచిత దృష్టిజూచి నీ। ధ్యానమొసంగి బ్రోవుమఖిలావనతత్పరశీల సత్ప్రభూ।౫౬॥

మ॥ అమితాఘాస్పదుడన్ మనంబును మదా హంకర్యపోగ్రంబు ఘోర। రము మర్త్యవృత్తి యుతంబు చర్యలహహా భ్రష్టస్యకావాగతి। మేమయం చున్ భయమయ్యె సర్వదురితవ్రాతంబుదూలింపని। కన్ మున్నీధ్యానమొకండొసంగి నదిగల్గం జేయవె సత్ప్రభూ॥౫౭॥

ఉ॥ నీవు త్రిలోకనాథుడవు నీవు సమస్తగుణాకరుండవున్। నీవె గుణప్రదాతవల నీగుణముల్ దెలియంగనేతున్నే। కేవలదుష్టవర్తనుడ కిల్బిషచిత్తుడ నీమహాత్మ్యముల్। వాపిరిదెల్పగాగలదె వాకుల హారి భవదీయ దివ్యస। ద్భావనమైన ధ్యానమును బాల్పడ సేయగదయ్య సత్ప్రభూ।౫౮॥

చ॥ సతమనరాని దేహమున శాశ్వతమాత్మవ

నంచువేళ సు। స్థితమతినై నిన్ను గొల్వవలె దేహా
బాసినయప్పుడా వశా। స్ఖలితమహిమాను భూతిఁ గాం
దవుర భవదీయ పదంబునుంచు సం। తతమును శా
స్త్ర సంతతిమనస్ఫుటసాక్షియు దెల్పుచుండెనా।
శ్రితముగనట్టి జైల్వెదయసేయవె సర్వశరణ్య సత్ప్ర
భూ॥౫౯॥

మ॥ తనుసంధిస్ఫుట భేదియౌ చరమసంతా
పంబు లేనప్పుడే। మునుగం బారుచు బెందురై యుప
యుపంబుల్ దూలకున్నప్పుడే। కను గ్రుడ్లంధములై
చు బోరగిలి [illegible] దప్పకున్నప్పుడే। యనిశంబ ప్రతి
భా ప్రభావుడవు సర్వాధారుడౌ నిన్ను బా। యని
డెందంబునొసంగి పాతకము మాయంజేయవే స
త్ప్రభూ॥౬౦॥



